### తెలంగాణ రచయితల వేదిక ప్రథమ మహాసభలో కాళోజీ నారాయణరావు అధ్యక్షోపన్యాసం

# తెలంగాణ బతుకు వేరే తెలంగాణ భాష వేరే

**1932**లో రాఘవాచార్యులు అనే కోస్తా ప్రాంతీయుడు, "తెలంగాణాలో ఆంధ్ర కవులు పూజ్యము" అని గోలకొండ పత్రికకు ఒక ఉత్తరం రాసిండు.. దానిమీద సురవరం ప్రతాపరెడ్డి 354 మంది తెలంగాణా కవుల కవిత్వాన్ని వాండ్ల వాండ్ల వివరాల తోటి ప్రయాసపడి సేకరించి గోలకొండ కవుల సంచిక ప్రకటించిండు. ఆయన ఇట్లన్నడు "నివురు గప్పిన నిప్పువలె నున్న ఇచ్చటి ఆంధ్రకవుల ప్రజ్ఞాపాండితీ విభవములను ప్రచారము చేయుటకు బయట వారికీ విషయమున గల భ్రమ నివారించుటయు పరమ కర్తవ్యముగా భావించి గోలకొండ కవుల సంచిక వెలువరించుటకు నిశ్చయించు కొన్నారము" అని

⁂ ⁂ ⁂

1940ల నేను బెజవాడకు పోయిన. ఒక హోటల్‌ల నా ఠికాన. నేను కిందికి వచ్చి అక్కడున్న పుస్తకాల దుకాండ్ల పుస్తకాలు చూస్తున్న. అక్కడ అప్పటికే ఓ పెద్ద మనిషి సూటు బూటు వేసుకొని నిలబడి ఉన్నడు. కొంచెం సేపు నిలబడ్డాంక అయన నన్నేదో అడిగిండు ఇంగ్లీషుల. నేను జవాబు చెప్పిన తెలుగుల. ఇంకా ఇట్లనే రెండు మూడు ప్రశ్నలు వేస్తే వాటికి కూడా జవాబుల్ను తెలుగల్నే చెప్పిన. అపుడు ఆయన ఓ ప్రశ్నవేసిండు "టు విచ్ ప్లేస్ యు బిలాంగ్" అని. మాది వరంగల్లన్న. ఆయన వెంటనే "యు సే యు బిలాంగ్ టు వరంగల్, బట్ యువర్ తెల్గు ఈజ్ నాట్ సో బ్యాడ్" అన్నడు. నాకు చర్రమన్నది. ఏమో కూస్తివి? అన్న. ఆ పెద్ద మనిషికి ఎక్కడ తాకాల్నో అక్కడ తాకినట్లున్నది. "అదేవిటి? కూస్తివి అంటారేటి" అన్నడు



తెలుగుల. అవును దీన్ని మా దిక్కు కూతే అంటరు అని మీదే ఊరు అన్న. అంటే బంద రన్నడు. మరి నువ్వు వరంగల్ ఎప్పుడున్న వచ్చినవా? - లేదు - బందర్‌లో వరంగల్ నుంచి వచ్చినోని తోటి ఎవనితోటైనా మాట్లాడినవా? లేదు. నువ్వు వరంగల్ రాలే. నీ ఊళ్ళ వరంగల్ వాణితోటి ఎవనితోటి మాట్లాడలేదు. నీకు వరంగల్ గురించి వరంగల్ తెలుగు గురించి ఏం తెలుసునని "యువర్ తెల్గు ఈజ్ నాట్ సో బ్యాడ్" అన్నవు అని దులిపి పారేసిన.

⁂ ⁂ ⁂

1950 తెలంగాణా రచయితల సంఘం వార్షికోత్సవంల విశ్వనాథకు రు. 116/- ఇచ్చి సత్కారం చేసినం. ఆ సభల ఆయన ఏమన్నడెరికేనా? ఇయ్యేడు నాకు చేసింద్రు సన్మానం, వచ్చే ఏడు మరో ఎల్లయ్యకు ఎవనికో చేస్తరు సన్మానం అన్నడు. అంటే తనకు చేసిన సన్మానం ఇంకెవని కన్నా తెలంగాణోనికి చేస్తే వాడు తన తోటి సమానమయితడుగద అది ఆయన మనసుల ఉద్దేశ్యం.

⁂ ⁂ ⁂

1952ల కృష్ణదేవరాయ భాషానిలయం స్వర్ణోత్సవాలు జరిగినపుడు ఫరీద్ అనే ఒక కవి ఒక పుస్తకం "కన్నీటి కబురు" అని రాసి శ్రీపాద కృష్ణమూర్తికి ఇచ్చిండు. స్వర్ణోత్సవాల సభల మాట్లాడటానికి వచ్చిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఆ పుస్తకం పేరును, అది రాసిన ఆయన్ని, అందులో కవిత్వాన్ని, ఆ వ్యవహారిక భాషను ఎద్దేవ చేసుకుంట మాట్లాడిండు. తెల్లారి కవి సమ్మేళనంల ఆయన విమర్శకు జవాబుగా నేను "సరస్వతీ భక్తుల్లారా" అన్న గేయం రాసి చదివిన. నా గొడవల అచ్చయింది. "శతాబ్దాల తరబడి ప్రవాహంలో పడి, రాపిడి పుణ్యాన రూపురేఖలు దిద్దుకున్న ముద్దువచ్చే రాళ్ళను, శివలింగాలను కన్నుల కద్దుకొని భక్తులు పూజకై దాచుకున్నట్లు, మానోట రాలిన మాట. ఆనోటా ఆనోటా వినవిండ్లై, మనసుకు పసండ్లై, జపించి జపించి సూత్రాలలో బిగించి సారస్వత పూజా ద్రవ్యంగా భద్రపరచుకున్నారు మీ వైయాకరణులు. అప్పుడప్పుడు మేమన్నదే ఐంది మీ అప్ప కవీయం కౌముది. మెరుపువలె పరుగెత్తే మా ఊహా తరంగాలకు బక్కెద్దుల నాపే పగ్గాలు పనికొస్తాయా? సరస్వతీ భక్తుల్లారా బ్రహ్మనే వెక్కిరిస్తర్రా? అని" మా రచనలో వ్యాకరణం మాత్రమే లేదు. మీ రచనంతా వ్యాకరణం తప్ప మరేమీ కాదు - అని కూడ అన్న-

⁂ ⁂ ⁂

శేషాద్రి రమణ కవుల్లో ఒక్కడైన రమణాచార్యులు బతుకుతెరువు కోసం వరంగల్ వచ్చి ఇక్కడ పంతులుగ నౌకరీ చేసిండు. ఆయన ఇక్కడ శాసనాల పరిశోధన ఇంక ఏదేదో చేసిండు కూడ. ఆయన ఇక్కడ ఇల్లు అదీ ఏర్పాటు చేసికొని సెటిలై ఇక్కడే చచ్చిపోయిండు. ఆయన చచ్చినాంక, ఆయన డైరీ అని సుప్రసన్నో ఎవరో సంపాదకత్వంలో అచ్చువేసింద్రు. దాంట్ల ఆయన తన దోస్తుకు ఒగణికి రాసిన ఉత్తరం ఉన్నది. ఏమన్నడెరికేనా? ఆయన వరంగల్ వచ్చినాంక రెండు పూటలా భోజనానికైతే కరువు లేకుండా వెళ్ళుతున్నది కాని, సాహిత్యకారుల సావాసం లేకుండ చచ్చిపోతున్న అని. మరి ఆయన పక్కింట్లనే గార్లపాటి రాఘవరెడ్డి, పదిండ్లవతల గొట్టుముక్కల రాధాకిషణ్ రావు, ఇంకా ఉదయరాజు శేషగిరిరావు, చొల్లేటి నరసింహ శర్మ ఎందరో ఉండిరి. వీండ్లందరు ఆయన కండ్లకు ఆనలే.

⁂ ⁂ ⁂

ఆ రోజుల్లనే మీజాన్ పత్రిక మూడు భాషల్ల వచ్చేది. తెలుగు పత్రికకు అడవి బాపిరాజు, ఆయన కింద విద్వాన్ విశ్వం, రాంభట్ల క్రిష్ణమూర్తి మొదలైన వాండ్లు ఓ పన్నెండు మంది సబ్ ఎడిటర్లు. వాండ్లకు మేం ద్వాదశ మార్తాండులని పేరు బెట్టినం. ఆ రాంభట్ల క్రిష్ణమూర్తి ఏమన్నడెరికేనా? తన జీవిత చరిత్రో, ఆత్మకథో రాస్తూ - ఆనాడు తెలంగాణ రచయితలు చేసిన రచనలన్నింటినీ మీజాన్‌ల తాను తెలుగుచేసి రాయవలసి వచ్చేదట భాష బాగలేక.

⁂ ⁂ ⁂

ఆ మధ్య చలసాని ప్రసాదరావు, విపుల, చతురలకు పనిచేసేటోడు ఏమన్నడు? అన్ని రచనలను మేం, భాష ప్రామాణికంగా ఉండాల్నని తిరిగి సవరించి రాయాల్సి వస్తున్నది అని.

⁂ ⁂ ⁂

ఇవ్వన్ని ఎందుకు చెప్తున్ననంటే, తెలంగాణ వాండ్ల భాష విషయంలో అవతలవాండ్ల భాష విషయంలో అవతల వాండ్లకు ముఖ్యంగ కోస్తా వాండ్లకు ఏం అభిప్రాయం ఉండెనో తెలిసేతందుకే. ఆనాడు రాఘవాచారి, తెలంగాణలో కవులే లేరన్నడు గాని, ఇవ్వాళ తెలంగాణల తెలుగు లేదంటున్నరు. ఇదెక్కడి విచిత్రం. ఇప్పుడు ఎంతమంది ప్రతాపరెడ్లు కావాల్నో? మళ్ళిపుడు ప్రామాణిక

భాష అంటున్నరు. ఏది ప్రామాణికం? ఏది వ్యవహారికం? ఎవని వ్యవహారం? 23 జిల్లాలల్ల ఎవని వ్యవహారం వానిదే. రెండున్నర జిల్లాల భాషనే అందరు రాయాలన్నదే శాసనం. తప్పంటున్న నేను. ఇట్లనే రాయాలె అని. వేరు వతుగ రాస్తే ఎక్కిరించుడు. బనాయించుడు. అర్థం కాలేదనుడు. కావాల్నని తమ ఆధిపత్యాన్ని, గొప్పతనాన్ని ప్రదర్శించటానికే. అట్లాంటోడు అయితే బేవకూఫ్ అన్న గావాలె. లేకుంటే బద్మాష్ అన్న గావాలె. ఈ మధ్య కొత్త స్లోగన్లు ఒకటి తీసిండ్రు "పత్రికల్లో ప్రామాణిక భాష" అని. ఇదే దేంజరు మాటే. మళ్ళీ ఒక నవగ్రాంథికాన్ని స్థాపించే ప్రయత్నమూ, కుట్రే. ఎవని వాడుక భాష వాడు రాయాలె. ఇట్లరాస్తే అవతలోనికి తెలుస్తదా అని ముందర్నే మనమనుకునుడు, మనను మనం తక్కువ చేసుకున్నట్లె. ఈ బానిస భావన పోవాలె. నే నెన్నోసార్లు చెప్పిన. భాష రెండు తీర్లు– ఒకటి బడిపలుకుల భాష, రెండోది పలుకు బడుల భాష, పలుకు బడుల భాష గావాలె. మన యాస మన భాష అన్న అభిమానం ఉండాలె. ఆదిలాబాద్ ఉదారి నారాయణ "ఆకుపచ్చని ఎడారి" అన్న పుస్తకానికి ముందు మాట రాస్తూ గోపి అన్నడు, తెలంగాణ మాండలికం అనుడు తప్పు తెలంగాణ భాష అనాలె అని. అవును తెలంగాణ బతుకు వేరే తెలంగాణ భాష వేరే ప్రత్యేక మయినయి.

ఇంగ్లీషోడు వచ్చి నాకు ఇంగ్లీషు రాదన్నడు అవును రాదు. ముస్లింలొచ్చి నీకు ఉర్దూ రాదన్నరు. అదెపాయె కాదు. వాండ్లు పెత్తనం చేపటాన్కి వచ్చినోళ్ళు. మరి నువ్వు అన్న అన్న అని పప్పుల ఉప్పేసి. పొత్తు గలిపి మనం మనం ఒక్కటని–నీకు తెలుగే రాదంటే? ఇది బద్మాష్‌గిరే. రావిశాస్త్రి రాస్తే. నామిని రాస్తే బాగున్న యంటరు. నిజంగనే వాండ్ల వాండ్ల ప్రాంతంల బతుకు అండ్ల కండ్ల బడ్తది. మరి నా తెలంగాణోడు రాస్తే "అబ్బే అందరికి తెలవదండీ" అంటే ఏవన్నట్లు?

ఎవని వాడుక భాష వాడు రాయాలె. ఇట్లరాస్తే అవతలోనికి తెలుస్తదా అని ముందర్నే మనమనుకునుడు, మనను మనం తక్కువ చేసుకున్నట్లె. ఈ బానిస భావన పోవాలె. నే నెన్నోసార్లు చెప్పిన. భాష రెండు తీర్లు– ఒకటి బడిపలుకుల భాష, రెండోది పలుకు బడుల భాష, పలుకు బడుల భాష గావాలె.

ఆమెవరో తెలంగాణ వాండ్లకు ఎవసం మేమే నేర్పినం, కట్టుబొట్టు, భాష సంస్కృతి అన్ని మేమే నేర్పినం అని అన్నదట. ఇంకా నయం తిండి తినుడు కూడ మేమే నేర్పినం అన్లె. ఇది దురహంకారం.

అసలు రాసేటోడు తెలుగోడయి చదివేటోడు కూడ తెలుగోడయితె సహృదయత ఉంటే తెలుగు అర్థమయితది. నాకు అర్థం కాలేదంటే నువ్వు తెలుగోనివి కాదన్నమాట. లేకపోతే సహృదయత లేదన్న మాట.

తెలంగాణ భాషంతా 'తౌరక్యాంధ్ర'మని ఎవడో అన్నడు. ఇపుడు అంటాండ్రు. మరి అట్లయితే నీది తెలుగేనా? చా అంటే తప్పు టీ అంటే తెలుగా? సిల్సిలా అంటే తప్పు సీరియల్ అంటే రైటా? సాల్టు, షుగరు తెలుగే. నాష్ట అంటే కొంప మునుగుతది. తోలు కొచ్చినం అంటే పశువులనే. పోయిందంటే చావే. కడప గాను గడపంటేనే రైటు. తొవ్వ తప్పు దోవ రైటు. పొక్కలెన్నున్నా బొక్కంటేనే రైటు. మందలించుడంటే తప్పుచేస్తేనేనట. మేరాయన దర్జీ అంటే ఛీఛీ పనికి రాదు టైలర్ అనాల్నట . ఎప్పట్నుంచో ఉన్న అదాలతులు, కోర్టులంటేనే న్యాయస్థానాలయితయట. ఏమిడిదంతా? అసలు అర్థాన్ని మార్చి జీతాన్ని 'తనఖా' అంటే కుదువ అంటవు. కంప్లేంట్ చేసేటోడు ముద్దయి మరి నువ్వు నేరం మోపబడ్డోన్నే ముద్దయంటున్నవు. ఎని జెప్పాలె ఇట్ల? 1969లో తెలంగాణ ఉద్యమం అప్పుడు ఎన్నో గేయాలు రాసిన. ఇట్లా వెక్కిరించేటోళ్ళను ఏం చేయాలె? ఏ రేడియోల్నన్నా తెలంగాణ భాష వినబడ్తదా? తెలంగాణ భాషంటే రౌడీలు, పనిమనుషులు మాట్లాడే భాషేనా? అంత అగ్వకున్నదా తెలంగాణ భాష? ఈ దౌర్జన్యాన్ని ఇన్నాళ్ళు సహించిన. ఇక సహించవద్దు. ఈ దోపిడిని ఎదుర్కోవాలె. అందుకనే నేను గిట్లనే మాట్లాడ్త, గిట్లనే రాస్త అని జిద్దుకు రాయాలె. జిద్దేంది అసలు మన యాసల్నే మన బతుకున్నది. తెలంగాణ యాస ఉంటేనే తెలంగాణ సంస్కృతి, జీవితం ఐతదా? రచనల తెలంగాణ సంస్కృతి జీవితం గూడా ఉండాలె అని కొందరంటున్నరు. నీ భాషల్నే నీ బతుకున్నది. నీయాసల్నే నీ సంస్కృతున్నది. ఆయాసలున్న పలుకు బళ్ళల్లనే తెలంగాణ జీవితం ఉన్నది. కమస్కం నీభాషల్నన్న నువ్వు రాసే ధైర్నం జేయి. తెలంగాణల ప్రపంచంల ఎక్కడ లేని పండుగ బతుకమ్మ పండుగున్నది. బతుకును పర్వానిపై చేసే పండుగ ఎక్కడ లేదు. మన ఆడవాండ్ల పాటలల్ల ఎంత జీవితం ఉన్నది? జానపదుల గీతాలల్ల ఎంత బతుకున్నది? మరిచి పోతున్న మన పండుగల్ను, మనం జరుపుకోవాలె, మనం పోగొట్టుకుంటున్న మన బతుకును బతికించుకోవాలె. దానికి, భాష చాన ముఖ్యమయింది. పరాయి వాని పెత్తనాన్ని దోపిడి దౌర్జన్యాన్ని ఎదిరించాలె.

ఎవని యాసల, ఎవని భాషల వాడు రాయాలె. తెలుస్తదా అన్నది లేనే లేదు. ఎంత గిచ్చుకున్నా, ఎంత రాసుక పూసుక తిరిగినా తెలంగాణలోని రచయితలకు కవులకు కోస్తాల గుర్తింపులేదు. మన కవులను రచయితలను మనం గుర్తించి గౌరవించుకోవాలె.

ఇవ్వాళటికైన ఈ సోయి వచ్చినందుకు సంతోషం, దానికోసం ఏర్పడ్డ ఈ తెలంగాణ రచయితల వేదిక అందుకు కృషి చేయాలె. ఏ ప్రయత్నాన్నయినా స్వాగతించాలె. నేను చెప్పేదొక్కటే. తెలంగాణా బతుకును కాపాడ్డానికి, తెలంగాణాను తేవడానికి ఎవడు ఏ ప్రయత్నం చేసినా సంతోష పడేటోండ్లల్ల నేను మొదటోణ్ణి. ఎవని ప్రయత్నం వానిది. చాతనయితే సహకరించాలె కాని ఒకని ప్రయత్నానికి ఇంకోడు అడ్డం పడద్దు.

రెండున్నర జిల్లాలదే దండి బాస అని, తక్కినోళ్ళ యాస తొక్కి పెట్టి, తమ ఆధిపత్యాన్ని మిగిలిన 21 జిల్లాల మీద రుద్దిండ్రు రుద్దుతున్నరు. అసలు ఈ రెండున్నర జిల్లాలు కూడ ఈనాడు చలామణీల ఉన్న భాష కొన్ని చదువుకున్న కుటుంబాల వాండ్ల భాషే. పత్రికలు, సినిమాలు, రాజకీయాలు అన్ని వాండ్ల చేతుల ఉంచుకొని ఈ దౌర్జన్యం చేస్తున్నరు. అసలయితే, ఈ రెండున్నర జిల్లాలు గాక మిగిలిన జిల్లాలన్నిట్ల గూడ, రాయలసీమలో కూడా, తమతమ ప్రాంత యాస, బాస విషయంల అలజడి గావాలె. ఈ పెత్తనం సాగనీయద్దు. దీన్ని ఎదుర్కోవాలె. నోటనోట మాటమ్మ, ఏమాటకు ఆమాటే, ఆమాట మాట్లాడెడి నోళ్ళు కోట్లు, కోటాన కోట్లు, ఆ కోట్ల నోళ్ళు అన్ని జిల్లాల గ్రామాల్లో ఉన్నయి. వాండ్లంతా ఈ భాష పేర పెత్తనాన్ని ఎదుర్కొని అలజడి చేయాలె. సీమసాహితి, కళింగాంధ్ర అని ఇప్పుడిప్పుడే కొద్దిగ వినవస్తున్నయి. ఇంకా బలపడాలె. తమ ఉనికిని, కాపాడుకొని చాటాలె.

ఇప్పటి నుంచయినా తెలంగాణ భాషల రాయండ్రి, తెలంగాణ భాషల మాట్లాడుండ్రి, తెలంగాణ బతుకు బతుకుండ్రి మన బతుకులను అన్యాయం చేస్తున్న 'దోపిడి చేసే ప్రాంతేతరులను దూరం దాకీ తన్ని తరుమాలె, ప్రాంతంవాడే దోపిడి చేస్తే, ప్రాణంతోటే పాతర పెట్టాలె,' ఇది 1969 నుంచి చెప్తనే ఉన్న.

ఇప్పటికయినా తెలంగాణ సోయి రచయితలకు వచ్చుడు సంతోషం. ఈ తెలంగాణా రచయితల వేదిక తన ప్రయత్నంల విజయం సాధిస్తదని, సాధించాల్ననే నాకోరిక.

ఆఖరున ఒక్కమాట. నామాటలల్ల అక్కడక్కడ సభ్యతలేదనే ఆక్షేపణ వస్తదని నాకెర్కే. కాని నాభాష, నాయాస, నాబతుకు, నా తెలంగాణ ప్రజల పట్ల సభ్యతగా ప్రవర్తించని వాణితో నాకేం సభ్యత అనేదే నా జవాబు.

**– కాళోజి నారాయణరావు**